

గ్రంథకర్త

బ్రII శిష్టు వేంకటసుబ్బయ్యశాస్త్రిగారు.

ఇయ్యది

బ్రII శిష్టు పురుషోత్తమయ్యగారి ద్రవ్య సాహాయము చే ముద్రింపించి ప్రచురింపఁబడినది.

నరసారావుపేట

శ్రీ కోటీశ్వర ముద్రాలయమున ముద్రితము.

**1937.**

వెల రు 0—2—0.

శ్రీరస్తు.

# అవతారిక.



ఆర్యులారా!

వినుకొండ తాలూకా నడిగడ్డగ్రామమున మద్బంధు వర్యుండగు వఠ్యము వేంకటసుబ్బయ్య గారింటికి జని నాటి సాయంతనంబున తద్గ్రామాంతంబునఁగల శ్రీ ప్రసన్నాంజనేయ స్వామివారిని దర్శించి హృదయానందంబుగా ధ్యానరూపకంబున "నడిగడ్డపురాంజనేయ నతజనగేయా" అను మకుటముగల వాక్యములు స్ఫురించి ప్రకాశంబుగాఁ బలుక నచటి భక్తబృందంబు నన్ను గాంచి కవిసత్తమా! యీ మకుటంబున శతకము వ్రాయుమని ప్రోత్సాహించుటయు నేకప్రాసంబున శతక రచన దుర్ఘటంబని తోఁచియు దద్భారము నాంజనేయునిపై వైచి నాజన్మ కృతార్థత కిదియె ముఖ్యమార్గంబని యెంచి నాశక్తికొలఁది శతకము వ్రాసితిని.

ఈ శతకమును విని సంతసించిన నామిత్రులగు బ్ర॥ గాడేపల్లి వీరరాఘవశాస్త్రి, ఉప్పల పిచ్చయ్యశాస్త్రి, మద్దులపల్లి గురుబ్రహ్మ శర్మగార్లొసంగిన యాశీర్వచన రూపకాభిప్రాయ పద్య రత్నముల నిందుఁ బొందుపఱచితిని.

మఱియు నామిత్ర రత్నమగు మ॥ గురుబ్రహ్మ శర్మగారు రచించిన ఆంజనేయ దండకంబును శ్రీ సత్యనారాయణ స్తోత్రాష్టకమును, అస్మద్గురూత్తములగు బ్ర॥ భారతుల పేరయ్యశాస్త్రి వరపు శ్రీరంగకవిగారు వ్రాసిన శ్రీ త్రిపురసుందరీ స్తోత్రపూర్ణక

యు గౌరవ పూర్వకముగా నీ శతకాంతంబున జేర్పబడినవి.

ఈ గ్రంథ ముద్రణకు వలసిన ద్రవ్యమును మదీ యానుజుండగు చి॥ శిష్టు పురుషోత్తమయ్య సాదరపూర్వకంబుగా నొసంగె. ఈవిషయ మిందుఁ బద్యరూపమున దెలుపఁ బడినది.

క్షమాపణ.

చ॥ అవిరళ పండితోత్తములకైనను లోపము లుండు గ్రంథముల్
దవిలిరచించువేళ నిక తప్పులు పొందితి నూతలేని నా
కవనమునందు నుండనె యఖండ దయా పరిపూర్ణచిత్తులై
సవరణసేయరయ్య మిము సన్నుతిచేసెదఁ జిత్తగింపుఁడీ॥

అన్నసముద్రము
5-9-'37

ఇట్లు బుధవిధేయుడు,
శిష్టు వేంకటసుబ్బయ్య,
గ్రంథకర్త.



# గ్రంథముద్రణప్రశంస.



సీ॥ శ్రీమదన్నసముద్ర గ్రామవాసుండు భూ
సురపుంగవుండు భాసురయశుండు
వరశిష్టు వంశ్యుండు పురుషోత్తమాఖ్యుండు
మెప్పుగాఁదనయన్న చెప్పినట్టి

పరమపవిత్రమై భాసిల్లుఁనడిగడ్డ
యాంజనేయశతక మచ్చుగూర్పఁ
దగుద్రవ్యమొసగెను ధర్మసిరూఢిచే
భక్తిప్రపత్తులు ప్రబలుచుండ

తే। గీ॥ రామపాదాబ్జసేవా ధురంధరుండు
భక్తహృదయ సరోరుహ భాస్కరుండు
ఆంజనేయుండు తత్వ విద్యావిదుండు
మించుకృపతోడ నితని రక్షించుగాత॥

క। సంతానంబులలోఁ గృతి
సంతానము లెస్సయైన నడిగడ్డని ధీ
మంతుఁడు పురుషోత్తముఁడ
త్యంతముదం బెసగదీని నవ్వొప్పించెన్॥



# కవివర్యాభిప్రాయములు.

బ్ర॥ గాడేపల్లి వీరరాఘవ శాస్త్రిగారు.

క॥ నడిగడ్డ యాంజనేయుని
కడుచిత్ర చరిత్రనీవు కందశతక మే
ర్పడఁజేసి తుడిచి తఘములఁ
గడచితి సంసారవార్ధి కవికుల తిలకా॥

క॥ ఏకప్రాసముతో డ న
నేక చరిత్రాత్మక పద్యాలల్ప్రాయఁగా
నీకెతగ శిష్టువంశ్యా !
లోకస్తుత్యా! కవిబుధలోక శరణ్యా॥

ఉ॥ లాలితకందపద్య సమలంకృతకావ్య వచోనుషంగ భా
వాళి ననేకరీతులుగ హృష్టమనస్కుఁడవై రచించి దే
వాళి శిరఃకిరీట మణిహారి విభాలసదంఘ్రి మారుతిన్॥
లాలనచేసి వేడ్కనిడి లాక్షణికాగ్రణులెల్ల మెచ్చగన్॥

చ॥ అవిదితశౌర్యరాశి వివిధామృతకావ్య ధురంధురుండు శ్రీ
ధవచరణాబ్జసేవకు డుదారుడు మారుతి కావ్యకర్తయై
భవము లడంప నేర్పడిమె భాగ్యముకాదొకో గాడేపల్లి రా
ఘవ కవివర్యుడన్నని జగద్ధితి మంచుఁ దలంచితిన్ మదిన్॥

---

బ్రి॥ ఉప్పల పిచ్చయ్య శాస్త్రిగారు.

చ॥ అనుపమశబ్దగుంభన రసార్థపరిస్ఫురణంబు గల్గి పా
వనకర శిష్టువంశసిత భానుడు వేంకటసుబ్బసూరి భ
క్తిని రచియించు నీశతము కేవలమోదముగూర్చె నామనం
బునకును విన్నమాత్రమున బొల్చునుగాత జగద్ధితంబుగన్॥

---

బ్రి॥ మద్దులపల్లి గురుబ్రహ్మ శర్మగారు.

క॥ అబ్బా! "డ" ప్రాసంబున
బ్రబ్బె శతకమ్ములు కొంతపని! యెట్టిది నీ
నిబ్బరము! శిష్టువేంకట
సుబ్బయ కవిచంద్ర చిరయశోగణ సాంద్రా॥

:o:



శ్రీరస్తు.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః.

శ్రీప్రసన్నాంజనేయాయనమః.

శ్రీ

# నడిగడ్డ పురాంజనేయ శతకము.



సీ। శ్రీరామపదపద్మ సేవాధురీణత
లవణార్ణవముదాఁటి లంకకేగి
సీతామృగాక్షి వీక్షించిముద్రికనిచ్చి
మోదంబుమీరగా ముచ్చటించి
పాటలాశోకాది పాదపాకీర్ణమౌ
దశకంఠుపనమెల్ల ధరణిగూల్చి
యక్షయాద్యసురుల హననంబుగావించి
రమణియిచ్చినశిరో రత్నమంది

తే. గీ॥ వచ్చిసుగ్రీవముఖ్యులౌ వనచరాళి
తోఁడనున్నట్టి రామచంద్రునకుసీత
వార్తలెఱిగించినట్టి శ్రీవాయుపుత్ర!
అనఘ నడిగడ్డ పురప్రసన్నాంజనేయ!॥

## — కందములు —

1. అడుగులకు మడుగులొత్తుచు
నడుముం గట్టికొని పలుప్రణామంబులనే
నిడికొలిచెద రక్షింపుము
నడిగడ్డపురాంజనేయ నతజనగేయా॥

2. కడుభక్తిం గొల్చెదను కే
లుమ్మడుపోదల జేర్చి వికటుమూర్తిత్రయి ధీ
రుడు శ్రీరంగకవీంద్ర గురు॥ నడిగడ్డ॥

3. వడులును బ్రాసలు గణములు
గుడి లఘువు లఘుపులు సుమలుంగొమ్ము లెఱుగన
ట్టెడ నీ శతకముం గూర్చెద॥ నడి॥

4. వడుగువని కొందఱు గృహ
స్థుడవని కొందఱుమనిన్ను స్తుతియించెదరె
వ్వడవో మొక్కెదబ్రోవుము॥ నడి॥

5. గడియైన బ్రహ్మచర్యము
నడుపుటసాధ్యంబె? యిన్నినాళ్ళేకగతిం
గడిపితివట తద్వ్రతమును॥ నడి॥

6. ఒడుపుగల వాఁడ వౌతయుఁ
జెడురాకసశిక్షకుఁడవు స్థిరతరఘనకా
యుడవునిను బొగడఁ దరమే॥ నడి॥

7. కడగియొక పిల్లకాలువఁ
బడవపయిని నైన దాట భయమగు నీవా
కడలి నెటుల లంఘించితో॥ నడి ॥

8. నిడుదయగు వంతెనపయిన్
బడి సంద్రంబెల్లఁ బ్లవగ వర్యులుదాటం
గడగిరి నీవలె నెగసిరె॥ నడి॥

9. వెడలెడుతరి లంకకు రా
ముడు నిను వీక్షించిజయము బొందగ దీవిం
పడెఁ గరుణారసమొప్పగ ॥ నడి ॥

10. వడియోజన శతమొక్క-
మ్మడి నుఱికి దశాస్యు నీటిమంగళవిభవం
బడు గంటఁ జేసితౌ భళి ॥ నడి॥

11 విడిచి చను మనుము మైనా
కుడు నిన్నెంతెంత వేడికొనినను వినక
ప్పుడె పోతి రాముపనికై॥ నడి।

12 జడనిధిని నీవు దాటగ
జడులగు రాక్షసులశౌర్య జవసంపదల
య్యెడ దాఁటెవారి మనములు॥ నడి॥

13 కడలిఁగని వనచరోత్తము
లడలంగను నీవుచూచి యదియెంతని పై
కొడియుచు లంఘించితికద॥ నడి॥

14 ముడుగని పూవుంబేరులు
దడసరిగను నాగవల్లి దళములసొంపే
ర్పడఁగూర్చి పూజసేతును॥ నడి॥

15 విడిగనొకతూరి మ్రోయగఁ
దడబడుఁ బాదములు ద్రోణి ధరణీధర మొ
క్కడవెట్లు తెచ్చినాడవో॥ నడి।

16 అడిదమున దరువుఁగొట్టగ
వడవడ వడకెత్తివిసుగు వసుసురు వన మే
సడిఁ బెరుక గలిగినాడవో॥ నడి॥

17 ఒడబడ వన్యాయమునకుఁ
దడబడ వెల్లెట్టి క్లిష్ట తరయోజనలకు
సుడిబడ వెంతటిశ్రమకును॥ నడి॥

18 చెడుగులగు వారలెప్పుడు
గడుభక్తిని నిన్నుగొల్వ గానేరక యె
ల్లడరులు బొందుదు రకటా॥ నడి

19 నిడుపగు వాలము విచ్చల
విడివిసరిన మాత్ర దైత్య వీరులునీచే
మడిసిరి కాదే రణమున॥ నడి॥

20 పడిభక్తి నీపదంబులు
విడువక పూజించుభక్త వితతికిసౌఖ్యం
బెడలేక యొసగి ప్రోతువు॥ నడి॥

శ్రీరామ.

# శ్రీమదాంజనేయ దండకము.



శ్రీవాయుపుత్రా! మహామేరుగాత్రా! లసత్పింగనేత్రా! నిశాశాబ్జమిత్రా! రసాంచచ్చరిత్రా! త్వదీయాంఘ్రి పద్మంబులం గొల్చి నీసేవనాసక్తిచేఁ బాప ముక్తుండనై యుండగా నెంచి యీ వేళ నీదండకస్తోత్రముం బాడుచుంటిన్ సదాయాదరంబొప్ప మా యాపదల్బాపి నీదౌకృపంజూపి రక్షింపరారా వనాంతర్విహారా! రణస్థానశూరా! నినేనమ్మినారా! వివేకం బొకింతైన లేనట్టి నేనొక్క మూఢుండ నిన్నెంతయున్ భక్తిచేఁ దప్పగాఁ జాల నన్నేల నీవే సుమీ భారమో కన్నతండ్రీ! త్రిమూర్త్యాత్మకం బుప్పతిల్లంగ నా యంజనాదేవి గర్భప్రభూతుండవై నీహరిత్వంబునన్ బాల్యచేష్టా విశిష్టుండవై యాకలింగల్గి బాలార్కబింబంబు బింబంబుగా నెంచి ప్రాంచత్ప్రతాపంబునం దాపమంచెన్నకే మ్రింగ సర్వప్రపంచంబు పంచత్వము న్బొందునట్లుండ దేవాదులెల్లం గడుం దల్లడిల్లన్ సురేంద్రుండు కోపోద్ధతిన్ వజ్రముంబూని నీ మోముపై వైవగా మూర్ఛిల న్నీపితృండౌ జగత్ప్రాణ దేవుం డదెన్ గిన్కచే గాలిబంధింపగా నెల్లవారుం బ్రలాపింప బ్రహ్మముల్లోదార్చి నీసేదనుందీర్చి నీకున్ వరంబుల్ప్రసాదింపగా శ్రేయమొప్పంగ నుప్పొంగి భవ్యుండవై వర్ధిలన్ రామచంద్రుండు సీతావియోగంబునం గుందుచున్

గానలం గ్రుమ్మరన్ నీవు సందర్శనంబంది నీసేయు సంధానముం
జేసి సుగ్రీవుసఖ్యంబు ముఖ్యంబుగాగాంచి నిన్నంతయు న్వేడి మ
త్కాంతవీక్షించి రమ్మంచు రామప్రభుం డుంగరంబిచ్చి పుచ్చన్
బ్రమోదంబునన్ రామమంత్రంబు స్వాంతంబునన్నిల్పి యెన్నెన్ని
యో విఘ్నముల్వాటిలన్ భగ్నముంజేసి సంద్రంబు లంఘించి లం
కంబ్రవేశించి యాలంకిణిందున్మి యెచ్చోసతిం గాంతునోయంచు
యోజించి శోధించి సాధించి రక్షోగణాధీసు కేళీవనం బందునం
జెట్టుకిందన్ విచారంబునం దైన్యగానున్న నీరేజనేత్రిన్ బొడం
గాంచి సందేహమున్ డింది సంతోషముంజెంది యా సాధ్వికి న్నీ
ప్రభావంబు భావంబునం దోషగా స్వస్వరూపంబు జూపించి రాక
న్నిరూపించి సద్భక్తి సాష్టాంగ దండప్రణామంబులర్పించి ముద్రన్ని
వేదించి శ్రీరాము క్షేమోక్తులన్విచ్చి యాదేవి యుల్లంబు జల్లం
బడంజేసి శృంగార పుందోట ధాత్రీధరం గూలగామీటి యక్షాది
రక్షోగణంబున్ వినాశంబుగావించి దేవారివీటెల్లఁ బాహాసటుల్
గాల్చిఁ భూపుత్రి తా నానవాల్గా శిరోరత్నమీయంగ గైకొంచు
వేవేగ వారాశినిందాటి మిత్రుల్మహానంద మింపొంద సుగ్రీవు నా
రామముందూరె దుర్వారవుం జైదముల్జేసి భల్లూక నీలాంగ దా
దుల్ నిన్నుజుట్టిముట్టంగ శ్రీరామచంద్ర ప్రభుంజేరి దేవి మతల్లిం
గనుంగొన్న సర్వప్రకారంబు విజ్ఞాపనన్ జేసి రామక్షమా భర్త
కున్ జాల సంతోషముంగూర్చి యున్నట్టిహా పావనాత్ముండ వీవే
కదా! యోమహాత్మా! నవవ్యాకృతుల్ నేర్చి మేలౌ తపంబేర్చి నీవే

జరామృత్యుబాధల్ నివారించికొన్నట్టి ధన్యుండవై యొప్పితో కాదె యో లక్ష్మణ ప్రాణసంరక్షణా! సాధుసల్లక్షణా! సత్కటాక్షేక్షణా! వైరిసంశిక్షణా! పిన్నటన్నుండి నిన్నాత్మనుం జేర్చి సేవింపుచున్నట్టి దీనుండ నాయందు సంపూర్ణ కారుణ్యముం గొల్పి పీడాపిశాచంబులం డుల్పి నన్నెల్ల కాలంబు రక్షింపగాఁ గర్తవీవంచుఁ బ్రార్థింపు చున్నాడనయ్యా! మదిన్ గన్నదన్ సేయకయ్యా! దయం గావుమయ్యా! తుషారాద్రిధైర్యా! మహాశౌర్యధుర్యా! కపీంద్రాళివర్యా! మహిన్ సింగరాద్రిన్ బ్రసన్నుండవౌ శ్రీప్రసన్నాంజనేయా! కనద్వజ్రకాయా! విరాజత్పురాట్లూరి వీరాంజనేయా! గురుబ్రహ్మశర్మాభిధేయావనా! భక్తసంజీవనా! ఓం నమస్తే! నమస్తే!! నమస్తే!!! నమః.



శ్రీరస్తు.

# శ్రీ సత్యనారాయణాష్టకము.



శా॥ శ్రీమద్భక్తజనౌఘ దివ్య హృదయక్షీరాబ్ధి చంద్రోదయా
సోమాదిత్య సమీక్షణా సురమునిస్తోత్రైక సంరక్షణా
భూమానందవిలాస! నన్ను గరుణన్ బ్రోవంగదే మ్రొక్కెదన్
స్వామీ! దీనుడ నర్సరాయపురవాసా! సత్యనారాయణా॥ ౧

శా॥ నీ కారుణ్యము నీమహామహిమయున్ నీరూపలావణ్యమున్
నీకళ్యాణగుణౌఘసంపదయు నిర్నిద్రప్రభావంబు ర
క్షా కౌశల్యము నెన్న బాకరిపుముఖ్యశ్రేణికిన్ శక్యమే
క్ష్మాకాంతాధిప నర్సరాయపుర ధామా సత్యనారాయణా॥ ౨

మ॥ క్రతువుల్ సేయుఫలంబు సర్వ నిగమగ్రంథార్థ సంఘూర్ణనో
ద్గతి భాగీరథి గౌతమీప్రముఖ తీర్థస్నాన పుణ్యంబు సా
రత రైశ్వర్యమభీష్ట సిద్ధియుచు గూర్పంజాలుఁ గాదే భవ
ద్వ్రతమాహాత్మ్యమునర్సరాయపురసౌధాసత్యనారాయణా॥ 3

మ॥ పరమేష్ఠిప్రముఖామరాళియె నిన్నున్ భావించి సేవింపఁజా
లరటంచున్ స్తుతులుగ్గడింప మన సిల్పన్నేరదుస్స్రష్టి ము
ష్కరుడన్ నీపదభక్తిగల్గి మెలగంగా నేర్తునే నన్ను వే
మరురక్షింపవె నర్సరాయపురధామా సత్యనారాయణా॥ ౪

21 జడులను గూడ కెపుడు నీ
యడుగులు సద్భక్తిఁగొల్చునట్టి మహాత్ముల్
గడుతురుకద భవవారిధి। నడి॥

22 పెడబొబ్బ లిడుచు వని బు
ష్పొడిబోల్చుమెచ్చుటలఁ జెపుదు పొందును సమకూ
ర్చెడిపట్ల నన్ని నేర్తువు॥ నడి।

23 ఇడుముల నానాగతులన్
బడుచుండెడివారిదుఃఖ వార్నిధికీవే
యుడుపముగా నుంటివి కద॥ నడి॥

24 అడు గిలపై నీవిడఁ బె
ల్లడరవె శేషునిఫణాళి యసురాగ్రణులన్
గెలుచుట నీకొక లెక్కయె॥ నడి॥

25 గడియన్ మూడుజగంబులు
వడకింపగజాలినట్టి వాడవునీవె
క్కడ తృణదద్రిదనుజులెక్కడ॥ నడి॥

26 తొడరినిను గొల్చువారల
కడుగంటుఁబిశాచబాధ లబ్బునుసిరు లె
ల్లెడల విజయంబుచేకురు॥ నడి।

27 దుడుకులగు భూతగణములు
వెడలిచనున్ నీదుపేరు విన్నంతనె మా
యెడఁ బీడ లంట నీకువము॥ నడి॥

28 పడరాని భూతబాధలఁ
బడువారలు నిన్ను మది నుపాసించినచోఁ
నెడబాపి సుఖములొసగవె। నడి॥

29 జడుపెఱుగనట్టి రణశూ
రుడవై పిరుదీక సురవిరోధుల నని లోఁ
గడతేర్చి తెంతవాఁడవు॥ నడి॥

30 గుడిగుడిని దోకనించుక
ముడుచుక నిలుచున్న నీకు మ్రొక్కవిపత్తుల్
విడుదలజేసి భరింతువు॥ నడి॥

31 పడె నక్షయుండు వనముం
బడిపోయెను తావకీన బలమున నిక నె
వ్వడు నిలుచునీదు ముంగట॥ నడి॥

32 అడగింప నీవు తలచిన
మృడుడును బద్మోద్భవుడు నుమేశుండును నీ
తోడరుడిగింపగఁ గలరే॥ నడి॥

33 ఉడుగణము డుల్లఁజేయగ
నుడుపతి ఖరకరులతాళ మొనరింప జగం
బుడికింపఁ జాలువాఁడవు॥ నడి॥

34 విడువవు దాశరథిస్తుతి
కుడువవు నిర్భక్తియుతుల కూడెంతయినన్
జడియవు రిపులకు రణమున॥ నడి॥

35 ఒడయని సేమము దెలుపం
బడగా విని సీత మెచ్చి వడి నిను బుణ్యా
త్ముడవని భూషించెనుకద॥ నడి॥

36 నుడుగుల నీకవచము రా
ముడు కృపను విభీషణునకు మునుకొని బోధిం
చడె సర్వపాపహరమని॥ నడి॥

37 గడిదేరిన కపులందొ
క్కడయిన నీసాటి బోలఁగలడే విద్వాం
సుడవు బలియుడవు శివుడవు॥ నడి॥

38 ముడిబెట్టి బొమలుకోపము
గడలుకొనగ నింద్రజిత్తు కమలజునస్త్రం
బెడలించి బట్టజంకవు॥ నడి॥

39 పెడతెరువరి రావణు క
ట్టడులన్నియు నిమిషమున బెఱాపంచలుగా
దుడిచి వినీతులుసెప్పితి॥ నడి॥

40 అడలక దనుజులువాలము
నుడుక జమురు కోకలొడ్డి హుతవహుఁగొల్పఁ
విడివడి లంకంగాల్చితి॥ నడి॥

41 జడియక లంకంగాల్చెడు
నెడ రావణు ననుజుగృహము నేర్పరచి కృపఁ
విడిపించి తేమిచిత్రమొ॥ నడి॥

42 గడుసరులగు రక్కసులం
గెడప జగత్ప్రాణునకను కేసరిగర్భ
స్థుండవై తేజముమించితి॥ నడి॥

43 బుడుతవయి భానుమ్రింగెడు
నెడ జగదుపకారి వనుచు నెంచియెకద వ్రే
ల్మిడి నంటకుండజేసెను॥ నడి॥

44 చెడుకోపంబున నింద్రుడు
పడ వ్రేయగ నిన్ను నెత్తి పవనుడుగుహాలో
నిడికొని రక్షుంబెట్టడె॥ నడి॥

45 జేడు పుడిగి నీవు నీజన
కుడు గుహాలోనుండ సురలు గుడువరములు మే
ల్వడగ నొసంగి జనరెశ్రీ। నడి॥

46 ఎడతెగని దుఃఖవార్నిధి
గడువగ నిన్ను నెడినావఁ గాంచితినని పల్
తడవల నుడువడె రాముఁడు॥ నడి।

47 అడరిన కష్టములన్నియు
నుడుగెను నీవలనజయము నొందితినని రా
ముడు నిన్ను బుజ్జగింపడె॥ నడి॥

48 కడవసుతు నెదుట రాముడు
కొడుకా నీఋణముదీర్ప గొఱగానని బ
ల్కడె నీతోడ వినమ్రమత। నడి॥

49 పడరానిలంపటులచే
విషమెఱుగక కుందుసీత వేదన మాన్పం
బనుటకుఁ గారణ మైతివి॥ నడి ॥

50 పడుపాటులన్ని గని రా
ముడు మది సంతసము జెంది మురిపెంబున నీ
మెడనిండ నిడ డెహారము॥ నడి ॥

51 జడదారులుంచు నెలవులు
బడగూలిచి వల్కలములు బారవయివ నీ
కిడిరి కద శాప మప్పుడు॥ నడి॥

52 జడదారు లిడినశాపము
నడిచేసిలా వెరుంగఁ జాలకపరు లే
ర్పడఁజెప్ప వేద్యమా కద॥ నడి॥

53 మడియింపగ బడనిసమ
ర్థుడవని కద లంకఁ గలసరోజాక్షిని రా
ముడుచూడ నిన్ను బంపెను॥ నడి ॥

54 చెడు గైనజంబు మాలిని
కుడిమొడమలు జూడనీక ఘోరరణమునం
గెడపిన శూరుండవుకద॥ నడి ॥

55 పుడమిసుతవార్త దెలియక
నడలుచుఁ జనుదెంచు రాము ననుజునకును గ
న్పడి ముచ్చటించి నాడవు॥ నడి ॥

56 ముడియు విడుపగుచుఁ బంక్తిము
ఖుడు వనమున సీతనెత్తికొనిపోతరి న
క్కడ నీవుండిన దునుమవె॥ నడి॥

57 పిడుగుద్దుల రిపుఁగూల్చగ
బెడబొబ్బలచేఁ బిశాచ పీడలడఁప ద
క్షుడవు సురపూజితుండవు॥ నడి॥

58 జడివానలోన బడు పెను
పిడుగుకిక్రియఁ బాక్తికంతు పీఠి పగులగా
బొడిచితివి ముష్టిఘాతల॥ నడి॥

59 కడిదాటి లంకఁజేరగ
పడతుక లంకిణి యొకర్తు భయపెట్టంగా
పిడికిటిపోటుల ద్రుంచితి॥ నడి॥

60 పిడి వ్రేటుల మొసగిన యా
గడుసరి లంకిణియు దనుజకాంతుడు నీ బ
ల్మిడి నెఱుగుదురుకదా శ్రీ॥ నడి॥

61 గొడుగులు వింజామరములు
బడగలు నందలము లలరుఁబొన్పులు మొద లౌ
గుడిసేవన లొనరించెద॥ నడి॥

62 పడతులు ప్రదక్షిణలుగా
నడకల నీసేవనము లొనర్పగఁ గరుణన్
గొడుకుల నిచ్చెదవట శ్రీ॥ నడి॥

63 గడగడలాడెడి జానకి
యడలెల్లనుఁ రెండునెలల కావల విభుచే
నుడుగు ననుచు నోదార్చితి॥ నడి॥

64 గొడవబడు సీత వెతయును
కడగన్పడ నట్టి తిమిరకాండము బాపం
బొడిచినభాస్కరుఁ డవుకద॥ నడి॥

65 పడిన కపికోటి కసువుల
నిడిలేవగఁ జేసినట్టి హితకారివి వై
ద్యుడ వైతి వెంతవాడవు॥ నడి॥

66 ఉడుగనిభక్తిని నీ వొ
క్కడవే శ్రీరామసేవకశ్రేణిని నె
క్కుడువాఁడ వందు రెల్లరు॥ నడి॥

67 కడలేని విద్యలందున
బడిపెద్దవు నీకు బోల్పఁబడరుకదా శే
షుడు షణ్ముఖుడు గజాస్యుఁడు॥ నడి॥

68 జలనిధిని దాటిలంకన్
బడతుక సీతకును శోక భరమును గష్టం
బెడ జేసిన ధన్యుండవు॥ నడి॥

69 వెడదమతి జానకీ నా
థుడు నాకథలుండువరకుఁ దొలిగఁజేయింపం
బడుభక్తుడ వై మను మనె॥ నడి॥

70 వెడలి జను మని నృపుం డన
గడు ధృతి దూలంగ బాష్పకణము లురులగా
నెడబాయజాలనంటివి। నడి।

71 బడుగుల రాకాసుల సొం
పడగగ సమయించిరాఘు వాధీసుపనుల్
గడుకొనితీర్చిన బంటవు॥ నడి॥

72 అడలకు జానకినీను వి
భుడు తమ్మునిగూడి క్షేమముగనుండెను నీ
బెడద లుడుపు ననిచెప్పితి ॥ నడి॥

73 ఉడుపతి రవిదిగ్గజములు
కడలులుఁ జెడకుండునంత కాలమును యశ
స్కుడవై జీవింతువుకద। నడి॥

74 అడవుల దశరథసుతులకు
నొడబాటుగ సూర్యసుతున కురుమిత్రత్వం
బొడఁగూర్చిన మేటివికద॥ నడి॥

75 పుడుకుచు రాముడు దయగ
స్పడగను నిను భావికాలబ్రహ్మవుగ మ్మం
చిడడే యాశీర్వాదము॥ నడి।

76 నడురేయి లంకకుంజను
నెడనొక మార్జాలరూప మెత్తితి నిజమా
యొడలెచట దాచినాడవో ॥ నడి॥

77 కొడుకవు గాడుపునకు భ
క్తుడ వా రాఘవనృపాల కోవిదునకు వీ
రుడ వాహావరంగమునకు॥ నడి॥

78 గడు విడక మదిని నెవరే
వడుపున గొలిచినను నట్టివారికిఁ బ్రాపే
ర్పడ సేతు విహాపరములకు॥ నడి॥

79 తడయక ద్రోణాద్రికిఁ బో
యెడి తరినొక మడుగులోన నేపున మ్రింగన్
దొడరిన మకరిని దుంచితి॥ నడి॥

80 కడసుతుడు సచివయోధులు
బడిపోవుట యెఱిగిదనుజ పాలుడుమది వే
రడియై చింతిల్లెనుకద॥ నడి॥

81 మునుపున జానకి డిగిచిన
తొడవులు శ్రీరామునకును దోడ్తోడన చూ
పడ జేసి శోకముడిపితి॥ నడి॥

82 కడగి నవవ్యాకృతులం
గడిదీరిన పండితుడవుగా బుధులెల్ల
ప్పుడు నిన్ను వినుతిసేతురు॥ నడి॥

83 జడతఁ గనని మునులు మహా
త్ముడ వని నినుస్మరణచేసి విమలతనాత్మన్
బడయుదురట సంతతమును॥ నడి

84 చెడు గడచు రాముపద మె
క్కడ నుడువంబడునొ యచట నురుభక్తిని గే
ల్మోడుపుఁగొని యశ్రులిడుదువు ॥ నడి ॥

85 పడతియుదంతము శ్రీరా
ముడు విని తనపదవి నిచ్చె ముఖ్యంబుగ నీ
కుడుగర యిదియె యటం చని॥ నడి॥

86 పొడిచి తిరు గాడు సూర్యుని
కడ వెలువక నిలిచి నిగమగణ ముఖవిద్యల్
గడియించిన ఛాత్రుండవు॥ నడి॥

87 ఎడ నెడల గృహము లందున
విడిసి మెసవి చనుచుకొనగ వెరతురు నీవే
నడి రవికడఁ జదివితివో॥ నడి॥

88 కుడిచితివి బాలసూర్యుని
బుడికి తినెడు పండటంచు మురుపిన్నటఁ గు
ఱ్ఱడ వెంతటి పనిచేసితి॥ నడి॥

89 నడలని ధృతి జనకజకై
జడుడగు దశకంఠు ముందు సౌధము జని య
య్యెడ నగ్నులఁగని రోసితి॥ నడి॥

90 దుడుకున సీతను బెదరిం
చెడి యసురల మాటలెల్లఁ జెట్టుపయిని మా
ర్మ్రుడు గాడక వినుచుంటివి॥ నడి ॥

91 కడిమి నిను దాఁకు సురస బ
లుఁడ వంచు నెఱుఁగు గాని లోకమునం దె
వ్వఁ డెఱుఁగ నేర్చుస్వామీ॥ నడి॥

92 ఎడ మిడక పారిజాతము
కడఁగన కగిరీంద్ర సదృశ కమనీయ ఘనాం
గుఁడవై నిల్చిన మేటివి॥ నడి॥

93 పొడవగు బుద్ధిబలంబును
ముడిచికొనని యశముధైర్య మును నభయం బె
ప్పుడుఁ గల్గు నిను భజించిన ॥ నడి॥

94 బడకగు రామాయణ మని
యెడు మౌక్తికమాల కీవు నింపొందగ జొ
ప్పడెడు రతనంబ వైతివి॥ నడి॥

95 [illegible]డియవడి రాము మొత్తని
యడుగుల కెఱఁగిన దశాస్యు ననుజుని నీదే
వుడుదయఁ గనజెప్పిన శ్రీ॥ నడి

96 వడి స్వర్భానుడు రవి పై
బడబోవగ నల్లనైన పండని తమియే
ర్పడ మ్రింగఁబోవె తొల్లిట॥ నడి॥

97 జడు మైరావణు దునిమిన
యెడ శ్రీరఘురామచంద్రు డింతటి ధీమం
తుడ వని నిను మెచ్చెను కద ॥ నడి ॥

## ఫలశ్రుతి.

98 పడబోవాధి వ్యాధులు
నిడుము లుడుగు సిరులుగల్గు నీశతకము నె
క్కుడుభక్తిఁ జదువువారికి॥ నడి॥

99 పుడమి శశి రవులు జుక్కలు
జెడకుండునో యంతవరకు క్షితినంతటి దా
కుడుగక నిల్చును శతకము॥ నడి॥

## గద్య.

100 నుడివితి శతకము శిష్టు కు
లుఁడ హారితసగోత్రుఁడనకలుషు శేషయ పు
త్రుఁడ వేంకట సుబ్బాఖ్యుఁడ
నడిగడ్డ పురాంజనేయ నతజనగేయా॥

## గ్రంథసంపూర్తి.

తే॥ గీ॥ పదియు నెనిమిది నూటయేబదియు శాలి ౧౮౫౦
వాహన శతాబ్దములుగల వత్సరమున
శిష్టువేంకట సుబ్బయ్య చేరచింపఁ
బడియె శ్రీయాంజనేయుని పద్యశతము॥

